

Chandamama, May '49

Photo by B. Ranganadham

నేను స్వేచ్ఛాజీవిని

# హిందీ చందమామ



కమ్మని కథలతో, చక్కని బొమ్మలతో,

జులై 1-వ తేదీ వెలువడుతుంది. విడి ప్రతి 0—8—0.

జూన్ మాసంలోపల చందాదారులుగా చేరువారికి

సాలు చందా 5—0—0 మాత్రమే.

నేడే చందాదారులు కండి.

---

# చందమామ

(తెలుగు)



ఈ నెలనించి తెలుగు చందమామ

సాలు చందా 4—8—0 మాత్రమే.

రెండు సంవత్సరాలకు 8—0—0.

## చందమామ పబ్లికేషన్సు

పోస్టుబాక్సు నెం. 1686. మదరాసు-1.

*

చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి



ఇవన్నీగాక పజిలు, ముగ్గులు, చిత్రుచదరాలు, చిత్రుబొమ్మలు, ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.


చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు. 1.

వేసవికి

## హాయిగొలిపే దుస్తులు

కావాలి సుమా.

★

మీకు, మీ పిల్లలకు

ఆనందమూ, సొగసూ

యిచ్చే

# బి.డి.యం.కంపెనీ

[కె.హెచ్.శ్యామారావు అండ్ సన్సు]

బెంగుళూరు వారి

# SAMSONS DRESSES

## మన్నికగల దుస్తులను

నిత్యమూ వాడండి

★

ఆర్గనైజర్లు :

ఆంధ్రకు :

జి. వెంకటప్పయ్య అండ్ సన్స్,

గాంధినగర్, బెజవాడ.

నిజామునకు :

ఫ్రెండ్స్ ఎంపోరియం,

27, ఘాస్‌మండి రోడ్, సికింద్రాబాదు.



# డోంగ్రేగారి

## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టియున్ను, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును. ఆరోగ్యము నిచ్చును.

K.T. Dongre & Co. BOMBAY - 4

## 'చందమామ' కు

## ఏజంట్లు కావాలి

★

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి వూరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలు కూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 2-0-0 పంపుతూ వుంటే మీకు 7 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిన మీకు ప్రతినెలా 0-10-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు మాకు వ్రాయండి.

## చందమామ ఆఫీసు,

పోస్టుబాక్సు నెం. 1686, మద్రాసు - 1.




సంచాలకుడు: చక్రపాణి

# హిందీ చందమామ

పాపాయిలూ! ఇప్పుడు మీకు పరీక్షలు ఐపోయి సెలవలు వచ్చినై. మళ్లీ మీ స్కూళ్లు తెరిచేనాటికి హిందీలో కూడా చందమామ వొస్తుంది.

కాబట్టి ఈ ఎండాకాలంలో మీరు కొద్ది కొద్దిగా హిందీ నేర్చుకోవటానికి చందమామలో హిందీ పాఠాలు యిస్తున్నాము. నేర్చుకుంటారుకదూ.

# అట్టపీది బొమ్మ

కృష్ణుడు పుట్టిన సంగతి తెలిసినప్పటినించీ, వానిని ఏవిధంగా చంపటమా అని కంసుడు ఆవేదన పడుతూనేవున్నాడు. రాక్షసగణంలో తెలివయిన వాళ్లనూ, నేర్పుకలవాళ్లనూ ఇందుకు నియమించాడు. ఎన్నో మాయోపాయాలతో వాళ్లు కృష్ణుణ్ణి చంపాలని చూశారు. కాని, అవతారమూర్తి అయిన కృష్ణుణ్ణి వాళ్లు ఏమి చేయలేకపోయారు. వాళ్లందరూ కృష్ణుని చేతిలోనే చచ్చారు.

కంసుడు పంపినవాళ్లలో తృణావర్తుడు అనే రాక్షసుడు చెప్పుకోతగ్గవాడు. వీడు కృష్ణుని చంపటానికి వేసిన వ్యూహం చాలా చిత్రమయింది.

ఒకరోజున, కృష్ణుణ్ణి తొడపయిన కూర్చోపెట్టుకొని, యశోద ఆడిస్తున్నది. ఆ సమయంలో, తృణావర్తుడు భయంకరమైన సుడిగాలి రూపం తాల్చాడు. గోకులపట్టణమంతా ధూళి రేగిపోయి, మనిషికి మనిషి కనపడకుండా పోయారు. అటువంటప్పుడు రాక్షసుడు, బాలకృష్ణుణ్ణి పైకంటా ఎగరవేసుకు పోయాడు. తనను బాగా ఎత్తునకు తీసుకుపోనిచ్చి, మాయలకృష్ణుడు తృణావర్తుణ్ణి గట్టిగా పట్టుకుని బరువెక్కటం ప్రారంభించాడు. ఆ బరువు భరించలేక, తృణావర్తుడు కృష్ణునిపట్టు తప్పించుకుందామని గింజులాడాడు. కాని, కృష్ణుడు పట్టు వదలలేదు.

కృష్ణుని భారానికి తృణావర్తుడు తట్టుకోలేక, నిజస్వరూపంతో చాపకట్టుగా నేల కూలి ప్రాణాలు విడిచాడు.

ఈవిధంగా కృష్ణావతారంలో భగవంతుడు, పరమ దుర్మార్గుడైన మరివక రాక్షసుని సంహరించి, లోకానికి మేలుచేశాడు.




















ఈ తొమ్మిది ఓడలూ ఒకేమాదిరిగా కనిపిస్తున్నా. నిజంగా అలాలేవు. తొమ్మిదింటిలో రెండుమాత్రమే ఒకేమాదిరిగా వున్నై. ఆ రెండు ఓడలూ ఏవో కనుక్కోండి. మీరు కనుక్కోలేకపోతే జవాబుకి 51-వ పేజీ చూడండి.

---

51-వ పేజీలోని చిక్కు చదరానికి జవాబు:

4-వ నెంబరుగల కాయ చదరం మధ్యవున్న యింట్లోకి పోగలదు.




అనగా ననగా నొకయూరూ
ఆయూరికి దరి కోనేరు
ఆ కోనే టొడ్డున బావీ
అంతులేని లోతుంటుంది.

తక్కరి పిలవా డాబావీ
తాగేటి పయిన్ గూర్చుండి,
కాళ్లవ్రేళ్ళు కదలాడిస్తూ
నీళ్ళు తొంగి చూస్తున్నాడు.

దొంగలరాయ డొకానొకడా
త్రోవను బో తిటు చూచాడు.
తాట తగులు కాజేయుట కా
తని దగ్గరకుం జేరాడు.

పిల్లాతం డిది గమనించీ
గొల్లున నేడువ సాగాడు.

దొంగ

ఎందుల కేడుస్తా వబ్బాయ్
ఎవరైనా నిను కొట్టారా ?

బాలుడు

కొట్టరు తిట్టరు కక్కయ్యా!
గులక రాలు రువ్వేసరికి
బంగరు టుంగ్రము జారిందీ,
బావిలోన పడిపోయింది.
తలిదండ్రుల కిది తెలిసిందా!
తంతారని యేడుస్తున్నా.

దొంగ

"అయితే దిగి తీసిస్తా నీ
వందాకిట గూర్చుండాలె
బట్ట లొడ్డుపై పెడుతున్నా
పదిలముగా చూస్తుండాలె."

అతడు "సరె లె" మ్మనగానే
నూతిలోకి దిగినా డితడు,
బురబుర లాడుతు బావంతా
నురుగులు గట్టగ మునిగాడు.

బట్టలు చంకన బెట్టా డా
బాలకుం డుడాయించాడు.
దొంగ పనేమై యుంటుందో
తోస్తే చెప్పుడు చూతాము.

రచన: 'ఏటుకూరి'




పూర్వం ఒకప్పుడు చాలా అందమయిన పిల్ల ఒకర్తె ఉండేది. ఆమెకు వడుకుపనీ, నేతపనీ బాగా చేతనవును. నిజానికి, ఆమె వడికినట్లూ నేసినట్లూ మరెవ్వళ్లూ వడకలేరు, నేయలేరు.

ఆ అమ్మాయి మగ్గందగ్గర కూర్చుని నేస్తూవుంటే ఎంతో ముచ్చటగా వుంటుంది. అందుకనే అనేక దేశాలనుంచి పెద్దపెద్దలెందరో ఆమె పనితనాన్ని చూడవస్తారు. నేసిన బట్టలపయిన ఆమె రంగురంగులతో వేసే పువ్వులు ఎంతో అద్భుతంగాకూడా వుంటాయి. అవి నిజమయిన పువ్వులే అనుకొని ఒకొక్కప్పుడు సీతాకోక చిలుకలూ అవ్వీ వచ్చి వాలుతూవుంటాయి కూడాను.

సామాన్యంగా జరిగే పని ఏమిటీ అంటే ఆ పిల్ల పని ప్రారంభించి, ఏదో ఒక వస్త్రం నేయడం పూర్తిచేసిం దనుకుందాం. ఈ సంగతి ఏ మహారాణికో తెలిసి, తక్షణమే కోరినంత ధనమిచ్చి కొనేసుకుంటుంది. ఆపిల్ల తయారుచేసిన వస్త్రాలను కొనటానికి అంత పోటీ.

ఈ విధంగా ఆ అమ్మాయి చాలాధనం సంపాయించింది. సంపాయించడం బాగానే వుంది. కాని, ఆపిల్లకు ధనం ఎక్కువగా పోగుపడేసరికి, తగని గర్వం పట్టుకుంది.

ఒకనాడు ఆ పిల్ల పనితనాన్ని చూడ వచ్చిన ఒక ఇల్లాలు అన్నదికదా, 'అమ్మాయీ! నువు నేసిన బట్ట పాము కూసంలాగా ఎంత నాజూకుగా వున్నదమ్మా! ఇంత నేర్పుకలగడానికి కేవలము ఆ సరస్వతీదేవే స్వయంగా నీకు ఈ విద్యను నేర్పివుండాలి!' అని.

ఇలా మెచ్చుకొన్నందుకు మరొకళ్లయితే సంతోషించివుందురు. కాని, గర్వించిన ఆ పిల్ల సంతోషించకపోగా, అడ్డుగా తల ఊపి, "వెళ్లవమ్మా, బాగా చెప్పావులే.

వి. జానకిరాంనాయుడు, గూడూరు.



అసలు ఆ సరస్వతీదేవికి వచ్చునా, నాకు నేర్పటానికి? అయినా, నాకేమిటి, ఎవళ్లో విద్య నేర్పడమేమిటి? నేనే వందమందికి నేర్పుతా" అంటూ బడాయిగామాటాడింది.

ఈ మాటలు వింటున్న ఆ పిల్ల తండ్రి "అమ్మాయీ! అలాగ మాటలాడటం పొర పాటూ, అవివేకమున్నూ. ఈ సంగతి సరస్వతీదేవికి తెలిసిందంటే నీకు తగినట్టు బుద్ధిచెప్పి, శిక్షించుతుందిసుమా!" అని ఆమెను మందలించాడు.

గర్వించిన ఆపిల్ల అప్పటికీ ఊరుకోక, "ఆలా అంటారేమిటి నాన్నగారూ! ఆ సరస్వతీదేవి ఇక్కడకు వచ్చినట్టయితే, ఎవరిపనితనము ఎటువంటిదో తెలిసిపోను. నేను నేసినంత నాజూకుగా ఆమె నేయ గలదేమో, రమ్మనండి చూదాం" అంటూ ఆమె తండ్రిమాటనుకూడా ధిక్కరించింది.

సరిగా అదేసమయంలో ఒకముసిలిది అక్కడకు వచ్చి, "అమ్మాయీ! నువు చాలా పనితనము నేర్చిన పిల్లవే కావచ్చు. అయినప్పటికీ, ప్రపంచానికి విద్యలు నేర్పే సరస్వతీదేవిని నిందించటం తగదు. ఇప్పు డయినా పొరపాటుకి పశ్చాత్తాపపడినా వంటే ఆమె నిన్ను క్షమిస్తుంది," అని మందలించింది.

ఈ మాటలు వినేసరికి ఆ గర్వించిన పిల్లకు ఉడుకెత్తి, "వెళ్ళవమ్మా ముసిలీ, నువ్వూ ఒక పెద్దమనిషిలాగ చెప్పవచ్చావు. నేతసంగతి నీకేంతెలుసు? తెలియని విష యంలో వేలెట్టడ మేమిటి? రమ్మను, మీ సరస్వతీదేవిని. పరీక్ష పెట్టిస్తే సరి, ఎవరి పనితన మెటువంటిదో చూద్దువుగాని" అని ముసిలిదానిని కసిరికొట్టింది.

వెంటనే ముసిలిదాని వేషం మార్చివేసి, సరస్వతీదేవి నిజరూపంలో ప్రత్యక్షమై ఎదట నిలబడింది!

అక్కడ ఆపిల్ల పనితనాన్ని చూడవచ్చిన వాళ్ళందరూ "అయ్యో, ఎంతపని జరిగింది! ఆ పిల్ల మంచి పనికత్తెయేను. అయితే ఎందుకు? తగని గర్వం. ఆమెకు బుద్ధి చెప్పటానికే సరస్వతిదేవి స్వయంగా వచ్చేసింది. ఆపిల్లను పాపం, దేవి ఏమిచేసి పోతుందో?" అని గడగడలాడిపోతున్నారు.

ఇంతపని జకిగినా ఆ ఫిల్లకు కొంచెము కూడా గర్వం తగ్గలేదు. "ఓహో, నీవేనా సరస్వతీదేవివి! సరే, సంతోషమే. కాని, నాతో సమంగా వడకడం, నేయడం నీకు చేతనవునా?" అని అడిగింది.

ఆ ప్రశ్నకు జవాబుగా "ఓసి పిచ్చిపిల్లా, ఇక్కడ రెండు మగ్గాలు ఉన్నాయి కదా! చెరివక మగ్గంమీదా నీవొకటీ నేనొకటీ వస్త్రాలు నేద్దాం" అన్నది సరస్వతీవేవి.

అలానే ఇద్దరూ నేత ప్రారంభించారు. కొంతసేపటికి ఇద్దరూ చెరివక వస్త్రమూ నేశారు. రెండు వస్త్రాలూ చక్కగానే ఉన్నాయి. దేవి నేసిన వస్త్రంపయిన ఆమె కొన్ని అందమైన బొమ్మలు వేసింది. దేవిని ధిక్కరించిన గర్వపోతులు ఎలా శిక్ష పొందుతారో, ఆ బొమ్మలు చూస్తే తెలుస్తుంది. ఈ బొమ్మలు చూచిఅయినా ఆపిల్ల



పశ్చాత్తాపంచెంది, బుద్ధి తెచ్చుకుంటుం దేమోనని ఆమె వుద్దేశం.

ఆ పిల్లకూడా తను నేసిన వస్త్రం పయిన కొన్ని బొమ్మలు వేసింది. ఆ బొమ్మలు సరస్వతీదేవి తన స్నేహితులతో పోట్లాడుతున్నట్లు కోపపు ముఖాలతో అసహ్యంగా ఉన్నాయి. ఆపిల్ల పనితనానికి దేవి సంతోషించింది కాని, వస్త్రంమీది బొమ్మలు చూడగానే ఆమెకు ఒళ్లు మండింది.

"అమ్మాయీ! నువు నాకంటె చాలా చక్కగా నేశావు. సంతోషమే. పనితనములో నువ్వే నాకంటె గొప్పదానివి. ఇంత పనితనము నీకు చేతిలో ఉన్నందుకు, తగిన వినయంకూడా ఉన్నట్టయితే రాణించి వుందువు. కాని నీకు తగని గర్వం బలిసిపోయింది. అందుచేత నిన్ను శిక్షించక తప్పదు. ప్రపంచంలో కల్లా వడుకుటలోనూ నేతపనిలోనూ నిన్ను మించినవాళ్లు లేరనే పేరు శాశ్వతంగా ఉండిపోయేటట్టు నిన్ను దీవిస్తున్నాను. అయితే, నీ గర్వానికి ప్రాయశ్చిత్తంగా నువు ఎల్లప్పుడూ ఈ పనిలోనే ఉండిపోతావు. మరేపనీ నీకు చేతకాదు. ఇదే శిక్ష!" అని సరస్వతీదేవి ఆ పిల్లను శపించింది.

ఇలా శపించుతూ, దేవి ఆపిల్ల నేసిన వస్త్రాన్ని తుండుతుండుగా చించివేసింది. దేవి పెట్టిన శాపానికి ఫలితంగా గర్వించిన ఆ పిల్లకు తలవెంట్రుకలు రాలిపోయినై. ఆమె చక్కటి శరీరమంతా తగ్గిపోయి, బొటనవేలి గోరంత చిన్నదయిపోయింది. క్రమంగా ఆమెకు, ఒక సాలెపురుగు రూపం వచ్చింది!

ఇక చేసేదేముంది? ఆ అమ్మాయి సిగ్గుచేత రెండు గోడలు కలిసిన మూలకు పోయి, నాటినించి నేటివరకూ నాజూకైన దారాలతో ఆలా గూళ్లు అల్లుకొంటూవుంది!






పానుగంటి రాజులు ఏలే రాజ్యంలో నాగళ్లపూడి గట్టున్నది. అక్కడ మాయల ఫకీరున్నాడు. వాడికి ఒక బ్రహ్మాండమైన కోట వున్నది. కోటలోపల ఏడు వెండి మేడలూ, పద్ధానుగు బంగారు మేడలూ ఉన్నాయి. అన్నిటికీ నట్టనడుమ పన్నెండు స్తంభాల మసీదున్నది. ఈ మసీదులో కూచుని మాయలఫకీరు అరవమూ, ఖురానూ చదువుతాడు. వాడు చాలా గొప్ప మంత్రగాడు. వాడి చుట్టూ ఎప్పుడూ భూతా లుంటాయి. ఏడువందల ఎర్ర భూతాలూ, మూడువందల ముక్కిడి భూతాలూ వాడు చిటికెవేస్తే పలుకుతాయి.

మాయలఫకీరు చిటికెవేశాడు. చాకలి దయ్యం దివిటీ పట్టింది. మంగలి దయ్యం అద్దంచూపింది. కుమ్మరిదయ్యం కూడు వండింది. గొల్లదయ్యం మేకలు తెచ్చింది. వెట్టిదయ్యం కట్టెలు తెచ్చింది. లంబాడీ దయ్యం కాళ్లు పట్టింది. ముసలి దయ్యం ముచ్చట్లు చెప్పింది.

తూర్పునుంచి ఒక పక్షీ, పడమటి నుంచి మరొకపక్షీ వచ్చి నాగళ్లపూడి గట్టుమీది గంగరేగు చెట్టుమీద జంటగా కూర్చున్నాయి. మాయలఫకీరు తన ఉంపుడుకత్తెఅయిన గాండ్లసంగును పిలిచి, "ఒసే, సంగూ! ఆ పక్షులు చూడవే. నాకు అటువంటి జోడులేదే!" అన్నాడు. గాండ్ల సంగు ముసలిదయి పోయింది, మరి ఒక పడుచు అందగత్తెను తెచ్చి దానితో సుఖంగా ఉంటూ, దానికీ, సంగుకూ లడాయిపెట్టి వినోదం చూడాలని పుట్టింది ఫకీరుకు. వాడు ఒక నల్లపిల్లిని చంపి భస్మంచేసి యెడమకంటికి అంజనంవేసి అందులో నాలుగు దిక్కులూ కలయ

చూశాడు. పడమటిదిక్కుగా పన్నెండామడ దూరాన పానుగంటి పట్టణంలో ఉన్న బాలనాగమ్మ మాయలఫకీరు కంటపడింది. ఆమెను చెరపట్టుకురావటానికి తీర్మానించు కున్నాడు. నాగళ్లపూడి గట్టుకింద మౌలాలీ పేటలో ఉన్న గాండ్లసంగుఇంటికి వెళ్లాడు.

గాండ్లసంగు ఫకీరుకు పట్టెమంచం వేసింది. రెండుపుట్ల గోధుమ రొట్టెలూ, పంధుం పెసరపప్పూ వండిపెట్టింది. ఫకీరు అదంతా తిని, మూడుతూముల నూనె తాగి, అరవైలోటాల కల్లు తాగాడు. కైపెక్కలేదు. తాటికాయంత నల్లమందు మింగాడు, నిషా రాలేదు. బంగీ తాగాడు. మత్తే కలగలేదు. మూడుపుట్ల గంజాయి బంగారపు హుక్కాలో వేసి చిలుము పట్ట సాగాడు. ఫకీరు హుక్కా తాగుతుంటే ఏడు పల్లెలూ ఒక్కసారి మండినట్టుంది. అప్పుడు ఫకీరుకు ఉషారు పుట్టుకొచ్చింది. బాల నాగమ్మను తీసుకురావాలనే తహ తహ జాస్తిఅయింది. లేచి చక్కగా వేషం వేసు కుని అద్దంలో చూసుకొన్నాడు. ఈవేషంతో బాలనాగమ్మను తీసుకురాలేనను కున్నాడు. బుద్దిచెంబు పట్టి, పంచాంగం చంకనపెట్టి, నడుముకు అంగవస్త్రంచుట్టి



బ్రాహ్మణవేషం వేశాడు. అదీ బాగా కనిపించలేదు. త్రాసు పట్టుకుని కోమటివేషం వేశాడు. అదీ బాగా లేదు. చివరకు నెత్తిన రుద్రాక్ష కిరీటం, నడుముకి బంగారు సల్లా, చంకన విభూతిజోలెలూ పెట్టుకుని బాలవయస్సుగల జంగందేవర వేషం వేశాడు. శంఖూ, గంటా చేత పట్టాడు. వెండిబెత్తమూ, బంగారు బెత్తమూ జోలీలో వేసి పానుగంటికి బయలుదేరాడు.

జంగంవేషంలో ఉన్న మాయల ఫకీరును తలారిరాముడు కోట బయట నిలవేసి లోపలికి పోవడానికి ఆజ్ఞలేదన్నాడు. బిచ్చం కావలిస్తే తానే వేస్తానన్నాడు. మాయలఫకీరు యెన్ని చెప్పినా తలారిరాముడు వినలేదు.

ఫకీరుకు కోపంవచ్చి, "ఓరీ నీ కిందుకనే పిల్లలు కలగలేదు. నేను చూతు, ఏడురోజుల కిందట బాల నాగమ్మకు బాలుణ్ణి యిచ్చాను" అన్నాడు. ఈ మాట వినగానే ఆ మాయ జంగాన్ని చూసి





తలారి రాముడు సాక్షాత్తుగా శివుడే అను
కున్నాడు. మాయలఫకీరు కాళ్ళమీద పడి
తనకు పిల్లల్ని ఇవ్వమని బతిమలాడాడు.
మాయలఫకీరు చిటికెడు విభూతి జోలెలో
నుంచి తీసి తలారిరాముడి నొసట పెట్టి,
గుప్పెడు విభూతి చేతికిచ్చి, "ఈ విభూతి
తీసుకుపోయి నీభార్యలనోట్లో కొంతవెయ్యి,
నెత్తిన కొంత చల్లు. నీ ఇంటిమీదా, కప్పు
మీదా, గాదెల్లోనూ, గంపల్లోనూ, బావు
ల్లోనూ, దొడ్డిలోనూ చల్లు" అని చెప్పాడు.

తలారి రాముడు ఒక్కపరుగున ఇంటికి
వెళ్లాడు. మాయలఫకీరు చెప్పినట్టే విభూతి
భార్యల నెత్తినా, నోళ్ళలోనూ, ఇంటోనూ,
కప్పుమీదా, దొడ్లోనూ, బావిలోనూ వేసే
శాడు. విభూతి పడిన చోటల్లా పిల్లలు
పుట్టుకొచ్చారు. తలారిరాముడి నెత్తినుంచీ,
వాడిభార్యల నెత్తినుంచీ పిల్లలు దూక
సాగారు. ఇల్లంతా పిల్లలే. గంపల్లోనూ,
గాదెల్లోనూ పిల్లలే. ఇంటికప్పుమీద పిల్లలు,
దొడ్డినిండా పిల్లలు. లుక లుక లాడుతూ
బావినిండా పిల్లలే. మూడు నాలుగువందల
పిల్లలు ఒకేసారి, "అమ్మా, అన్నమే!
నాన్నా, అన్నమే!" అని ఒకటే గోల చేస్తు
న్నారు. ఎంతతిన్నా వాళ్ళ ఆకలి తీరదు.
ఇల్లంతా ఊడ్చిపెట్టేశాడు తలారి రాముడు.
వాడికి గాభరా యెత్తింది. ఒక్క పరుగున
వచ్చి జంగం కాళ్ళమీదపడి, "బాబూ,
నాయనా! నాకు పిల్లలూ వద్దు, పిడుగులూ
వద్దు! ఈ పిల్లల్ని లేకుండా చేస్తివా,
నిన్ను కోటలోకి పోనిస్తాను" అన్నాడు.

మాయలఫకీరు మళ్లా తలారిరాముడి
నొసట విభూతిపెట్టి, "పో, నీకు కావలసి
నంతమంది పిల్లలే ఉంటారు!" అన్నాడు.
తలారి రాముడు ఇంటికి వెళ్లి చూసుకునే
సరికి, జంగం దేవర ధర్మాన, ఏడుగురు
పిల్లలే ఉన్నారు. తలారి రాముడి ప్రాణం



కుదటబడింది. వాడు తిరిగివచ్చి మాయల ఫకీరును కోటలోపలికి పోనిచ్చాడు.

మాయలఫకీరు కోటలో ప్రవేశించాడు. బాలనాగమ్మ ఏడురోజుల బాలింతరాలు. ఆమె అక్కలు ఆరుగురూ వెండి బిందెలు పట్టుకొని బావికిపోతూ కనిపించారు. ఫకీరు వాళ్ళ బిందెలనిండా వరహాలు చేశాడు. వాళ్లు ఆశ్చర్యపడి యింటికిపోయి చూసుకుంటే బిందెలనిండా చిల్లిపెంకు లున్నాయి. మాయలఫకీరు సూర్యనాగమ్మ ఇంటికి పోయి, "గారడివానికి, కట్టుమోతు వానికి, బాలింతరాలికి, పసిబిడ్డ తల్లికి మా బసవన్న విభూతి పెట్టితే, భూతప్రేత పిశాచములు పారిపోతవి, బ్రహ్మరాక్షసు లణగిపోను. శాంభమూర్తి కరుణా కటాక్షం కలిగి, గురుకటాక్షం కలిగి వర్ధిల్లవలె" అని అరిచాడు.

ఈవిధంగా బాలనాగమ్మ అక్కలు ఆరుగురి మేడలకీ వెళ్లి భిక్షం అడిగాడు. ఆఖరుకు బాలనాగమ్మ మేడకు వచ్చాడు. భం భం అని శంఖం పట్టాడు. దాసీలు బిచ్చం వెయ్యబోతే తిప్పికొట్టి, ఇంటి యజమానురాలిని వచ్చి బిచ్చం వెయ్యమన్నాడు. బాలనాగమ్మ పురిటి బాలింతరాలని దాసీలు చెప్పారు. బాల నాగమ్మ బయటికి వచ్చి బిచ్చం వెయ్యక పోతే తా నిచ్చిన సంతానం తిరిగి తీసుకు పోతానని బెదరించాడు. దాసీలు భయపడి వెళ్లి బాలనాగమ్మకు చెప్పారు. తన బిడ్డను ఎక్కడ చంపిపోతాడో అని బాలనాగమ్మ పురిటి మంచం మీదినుంచి లేచి జంగం దేవరకు బిచ్చం పెట్టటానికి సిద్ధపడింది. కాని, మంచంలో పిల్లవాడు ఏడవసాగాడు. వాడు ఏడుపు మానుతాడని తన వేలి ఉంగరంతీసి వాడి వేలికి పెట్టింది. బిచ్చం పట్టుకుని బయటికి వచ్చింది.



బాలనాగమ్మ ఏడుగిరులు దాటివస్తేగాని మాయలఫకీరు బిచ్చం పట్టనన్నాడు. గిరులు దాటిరావటానికి బాలనాగమ్మ భయపడింది. పిల్లవాణ్ణి చంపేస్తానని ఫకీరు భయపెట్టాడు. బాలనాగమ్మ ఫకీరు మాటలకు జడిసి బయటికి వచ్చింది. బిచ్చం జోలెలో వేసుకుంటూ ఫకీరు ఆమెను రాగిబెత్తంతో తాకాడు. వెంటనే బాలనాగమ్మ కుక్కగా మారిపోయింది. కుక్క లోపలికి పరుగెత్తి "బొంయి,బొంయి"మని అరుస్తూ పిల్లవాడి మంచం చుట్టూ తిరిగింది. ఫకీరు కుక్కను బయటికి రమ్మని అదలించాడు. కుక్క బయటికి వచ్చేసింది. దాని మెడకు తోలుపట్కా తగిలించి మాయలఫకీరు వెంటబెట్టుకొని కోటబయటికి వచ్చాడు.

కోటవాకిట తలారిరాముడున్నాడు. వాడు జంగందేవర వెంట ఉన్న కుక్కను చూసి, "ఇది నీ వెంట లోపలికి పోలేదే, దీన్ని నేను బయటికి పోనివ్వను"అన్నాడు. ఫకీరు మంచిగా చెప్పాడు. బెదిరించాడు. కుక్క బయటికి పోవటానికి మటుకు తలారి రాముడు ఒప్పలేదు. ఫకీరు తన జోలెలో నుంచి ఇంత విభూది తీసి తలారిరాముడిపై చల్లాడు. వాడికి శివం ఎత్తింది. పిచ్చివాడల్లే తలారిరాముడు పొలాలవెంటా, అడవులవెంటా పరిగెత్తసాగాడు.

మూడోనాటికి మాయలఫకీరు నాగళ్ళపూడి గట్టుకింద మౌలాలీపేట దగ్గిర ఒక మర్రిచెట్టు చేరుకున్నాడు. వెంట వస్తున్న కుక్కను బంగారు బెత్తంతో తాకాడు. గల్లు గల్లున గాజుల చప్పుడైంది. అందెల మువ్వల చప్పుడైంది. తళుక్కున మెరిసి బాలనాగమ్మ ప్రత్యక్షమయింది. మోహం పట్టలేక మాయలఫకీరు "కోమలాంగీ, నా కోరిక దీర్చవే. ఒక్క ముద్దు పెట్టవే," అని తహతహ లాడసాగాడు.

"ఓరీ మాయలఫకీరా, నేను పన్నెండేళ్ల వ్రతం పట్టాను. ఆవ్రతం పూర్తిఅయేదాకా నీ కోరిక చెల్లించలేను. ఆ తరవాత నేనెక్కడికి పోతాను? ఈలోపల నన్ను ముట్టుకుంటివా తలపగిలి చచ్చిపోతావు, జాగ్రత్త" అన్నది బాలనాగమ్మ.

ఇన్ని మాయలు నేర్చిన మాయలఫకీరుకు వశీకరణ మంత్రాలూ, ఆకు పసరులూ తెలియవు. బాలనాగమ్మ మాటలకు వాడు భయపడి గడగడ వణికిపోయాడు.

బాలనాగమ్మను వెండిబెత్తంతో తట్టి ఇంత బూడిదచేసేసి ఆ బూడిదను జోలెలో వేసుకుని గాండ్లసంగు మసీదుకు వెళ్లాడు. బాలనాగమ్మను తీసుకురావటం సాధ్యం కాక మాయలఫకీరు ఒంటరిగా తిరిగివచ్చాడనుకుని గాండ్లసంగు వాణ్ణి యెగతాళి చేసింది.

మాయలఫకీరు జోలెలో బూడిద పైకి తీసి బంగారు బెత్తంతో తట్టాడు. గల్లుగల్లున గాజులూ, అందెల మువ్వలూ మోగుతూ, తళుక్కున బాలనాగమ్మ ప్రత్యక్షమయింది. మసీదంతా ఒక్కసారి వెలిగిపోయింది.

"అయ్యో, తల్లీ! వీడిపాల నేను పడనే పడ్డాను. నువుకూడా యెందు కొచ్చావు?" అని అడిగింది గాండ్లసంగు బాలనాగమ్మను. బాలనాగమ్మ భోరున ఏడ్చింది.

బాలనాగమ్మను మసీదులోనే ఉంచి, మాయలఫకీరు పన్నెండేండ్ల వ్రతం ఎప్పటికవుతుందా అని యెదురు చూడసాగాడు.

మసీదులో బంధింపబడిన బాలనాగమ్మ తన పసిపాపకు కలిగిన అవస్థ తలుచుకొని దుఃఖించసాగింది. దుర్మార్గుడయిన మాయలఫకీరు తనను ఖైదుచేసినట్టు తన భర్తకు ఎలాగ తెలియటం? [ఇంకావుంది]






ఒకానొక గ్రామంలో బాబా అనే వృద్ధుడు ఉండేవాడు. ఆయన ఋషివంటి వాడు. బుద్ధిమంతుడు. మహాజ్ఞాని. దయామూర్తి. ఆ గ్రామంలో బాబాపైన పెద్దలందరకూ ఎంతో భక్తి, పిల్లలకు గౌరవమున్నూ. పిల్లలు ఆయనదగ్గర చాలా చనువుగా మసులుకొనేవారు.

ఆయనను ఆ గ్రామస్థులందరూ తండ్రిగా ఎంచుకొంటూ, వారివారి జీవితాలలో మంచిచెడ్డలు, కష్టసుఖాలు ఆయనతో చెప్పుకొంటారు. ఆయన వారి నందరనూ బిడ్డలుగా చూచుకొంటూ, వాళ్ల కష్టాలు తొలగిపోవటానికీ, సౌఖ్యం కలగటానికీ తగిన సలహాలు చెబుతూ వుంటాడు. అతనివల్లనే ఆ గ్రామం సుఖంగా ఉండేది.

బాబాకు చదువంటే ప్రాణం. అందు కని, ఊరికి దూరంగా ఒక ఎత్తయిన గుట్ట పయిన యిల్లు కట్టుకొని, ఇంటిలో అనేక మైన బీరువాలు అమర్చి, వాటిలో తనకు ప్రియమయిన గ్రంథాలన్నీ చక్కగా సర్దుకొన్నాడు.

గ్రంథాలంటే, ఈనాడు మనము రోజూ చూస్తున్న అచ్చుపుస్తకాలనుకున్నారేమో!—బాబా కాలంనాటికి ఇంకా అచ్చు యంత్రం కనిపెట్టనే లేదు. అందుచేత, ఒక గొప్ప గ్రంథమున్నదంటే, విలువ తెలిసినవాళ్లు దానిని తిరగ రాసుకునేవారు. ఇందుకు యెంతో డబ్బు ఖర్చయ్యేది. రాయటం పూర్తికావటానికి ఎంతో కాలం పట్టేది. బాబా బీరువాలలో ఉన్న గ్రంథాలన్నీ, ఈ మోస్తరుగా కష్టపడి సంపాదించినవే.

ఆయన కూర్చునే గది కిటికిలో నించి కిందికి చూచినట్టయితే, పంటముఖానికి వచ్చిన పచ్చటిచేలు కంబళీపరచినట్టుగా

బి. విశ్వం, మద్రాసు



కనబడి, అందంగా వుండేవి. ఆ పొలాలలో ఎప్పుడు చూచినా, తేనెటీగలవలె పాటు పడే రయితుజనం అగపడుతూ వుంటారు. ఇటువంటివన్నీ కనపడుతూ వుండటం వల్లనే ఆ గదిలో కూర్చుని చదువుకోటానికి చాలా హాయిగా వుంటుంది.

బాబా నివసిస్తున్న గుట్టదిగువనే ఊరు. ఆ ఊరికి, ఆనుకునే, ఒక నదిప్రవహిస్తూ వున్నది. నదిలో నీరు ఊరిమీదికి రాకుండా ఒక పెద్దగోడ కట్టబడి వుంది.

ఒక రోజున మధ్యాహ్నం, పుస్తకం చదువుకొంటున్న బాబాదృష్టి ఆ గోడమీదికి మళ్లింది. ఆ గోడ యిదివరకే అవుకుగా ఉన్నసంగతి బాబాకు తెలుసు. దానిని మరమ్మతు కూడా చేశారు. అయినా, ఎందుచేతనో కాని, అది ఇప్పుడు బీట వేసి వున్నది. ఉండడమేమిటి?- బీటలోనించి నీరు చిమ్ముతూ, అది పెద్ద దవుతున్నట్టు బాబాకు స్పష్టంగా కనిపించింది. ఇంకొక్క అరగంటసేపటిలో ఆ గోడకు ప్రమాదం సంభవించి, అదిపడిపోతుందని అనుభవం వల్ల ఆయననిశ్చయించాడు. అందుకోసమే, చదువుతున్న గ్రంథం మూసివేసి, బాబా ఆ గోడవేపు అదేపనిగా చూడ నారంభించాడు.

ఇప్పుడు అతనికి మనస్సులో బెంగ పట్టుకొన్నది. ఏమీ అంటే, గ్రామస్థులందరూ పొలాలలో పని చూచుకొంటున్నారు. గోడసంగతి వాళ్ళకేం తెలుసు, పాపం? ఇంకొక్క అరగంటలో గోడ పడిపోయి, ఊరిలోకి నీరు ముంచుకువస్తుంది. అటువంటి సమయంలో, పనిపాటలలో మునిగివున్న గ్రామస్థుల ప్రాణాలను ఎలాగ రక్షించడం ?

వృద్ధుడు కావడంచేత, తను స్వయంగా పొలాలలోకి వెళ్లి వాళ్ళను హెచ్చరించ



లేదు. పోనీ, ఈ మాట చెప్పి రావటానికి మనిషిని పంపుదామా అంటే, ఇంటిలో ఎవరూ లేరు. ఇంతకూ, ఎవరైనా పోయి కబురు చెప్పిరావటానికయినా వ్యవధి ఉంటుందనే నమ్మకంలేదు. ఈ పరిస్థితులలో ఆయన ఏమి చేయగలడు?

ఆలోచిస్తూ, మళ్లీఒక్కసారి గోడవేపు చూడగా, అప్పటికప్పుడే గోడబీట ఇంకా పెద్దదయి, నీరు మరీ జోరుగా ప్రవహిస్తూ వున్నది.

బాబా తక్షణమే వంటింటిలోకి వెళ్ళి మండుతున్న కట్టెలు రెండు తీసుకు వచ్చాడు. అందులో ఒకదానిని తనకు ప్రాణసమానమయిన పుస్తకాల గదికి, మరొకదానిని పెరటిలో వున్న గడ్డిమేటికి అంటించాడు. అయిదు నిమిషాలయినా కాకుండానే పొగలు కమ్మేసి, జ్వాలలు ఎగసి వచ్చాయి.

గుట్టమీది పొగలూ, మంటలూ చూచి, పొలాలలో వున్న జనం "అయ్యో, మన బాబా! మన బాబా యిల్లంటుకున్నది!! రండి, రండీ!!!" — అని కేకలేస్తూ, గోలపెడుతూ, గబగబ గుట్టపైకి చేరుకున్నారు.

ఆ వచ్చిన మగవాళ్లు నీళ్లు తెచ్చి, మంటలు ఆరపబోయారు. కాని, బాబా వాళ్ళపయిన కోపగించాడు: "మీరు ఆరపవద్దు, ఏమీ వద్దు. ముందువెళ్ళి పిల్లలనూ ఆడవాళ్లనూ, ముసిలివాళ్ళనూ, నోరు లేని జీవాలనూ తీసుకవచ్చి గుట్టపైకి చేర్చండి. ఒక్క పిట్టయినా వూళ్లో మిగిలిపోకుండా, తక్షణమే తీసుకరండి, వెళ్ళండి!!!" — అని ఆత్రంతో వాళ్లను తొందరపెట్టసాగాడు.

ఆయన మంటలు ఆరపవద్దు అనగానే అందరకూ ఆశ్చర్యం వేసింది. అయినా, బాబా చెప్పినమాట దాటడానికి వీలులేదు.

ఆయన చెప్పే ప్రతిమాటలోనూ ఏదో గొప్ప భావం వుంటుందనీ, అది నిలకడమీదగాని అర్థంకాదనీ ఆ పూరిప్రజలకు నమ్మకమే. కనుక, బాబా ఆజ్ఞప్రకారం, వాళ్ళు పోయి, ఒక్క పిట్టయినా దిగుబడిపోకుండా, అందరనూ గుట్టపైకి చేర్చారు.

ఈ రోజున బాబా ఆడే మాటలూ, చేసే పనులు ఎవళ్లకు బోధపడటంలేదు. తలకొక విధంగా అనుకొంటున్నారు. అయన చిరునవ్వుతో "అందరూ ఆగోడవేపు చూడండి" అని అంటూవుండగానే, ఆ పెద్దగోడ విరిగి గభాలుమని కూలింది. గోడ కూలిపోయిన తక్షణమే యింకేమున్నది ?— నది గట్టు తెంచుకొని పారింది. చూస్తుండగానే, ఇళ్లన్నీ మునిగిపోయినయి!

బాబా చేసిన త్యాగం అందరకూ తెలిసిపోయింది. వాళ్ళకు అయనపైన వుండే భక్తి, గౌరవమూ మునపటికంటె రెట్టింపై నయి. ఆ గ్రామం మళ్లీ నిర్మించినప్పుడు దానికి 'బాబానగరం' అని పేరుపెట్టారు.

ఏమయినప్పటికి,— ఆయన కష్టపడి సంపాదించి, ప్రాణసమానంగా కాపాడుకొంటున్న గ్రంథాలను, గ్రామస్థులను రక్షించటంకోసం, తనచేతులతో తనే తగలబెట్టాడన్న సంగతి తెలియగానే వారందరూ వల వల ఏడిచారు.

వాళ్లతో బాబా "బిడ్డలారా! మీ రెంత మాత్రము విచారించకండి. గ్రంథాలు విలవయినవీ, నాకు ప్రాణసమానమైనవీ అనేమాటనిజమే. కాని, మిమ్మల్ని రక్షించటానికి గ్రంథాలేకాదు, నా ప్రాణాలనే ఇచ్చివేస్తాను. ఈ క్షణానికి మీ రందరూ ఇక్కడ చేరుకొని, చల్లగా ఉండటం నా కళ్ళతో చూచాను. అదే నాకు పదివేలు! అదే నా జీవితానికి సంతోషం" అని జాలిగా జవాబు చెప్పాడు.






అనగనగా అబ్బాస్ అనే కుర్రవాడు ఉండేవాడు. అతను చాలా మంచిపిల్ల వాడు. తలిదండ్రులు చిన్నతనంలోనే పోవడంచేత, అబ్బాస్‌ను ఒక రయితు చేరదీసి పెంచుతున్నాడు.

ఇలా వుండగా, ఆ దేశంలో ఒకప్పుడు కాటకం పట్టింది. తిండి లేక ప్రజలు మలమల మాడిపోతున్నారు. ప్రాణాలు నిలబెట్టుకోవడం ఎలాగా అని రయితు బెంగతో వున్నాడు. అటువంటప్పుడు, ఎంత అభిమానం ఉంటే మాత్రం, అబ్బాస్‌కు అతనేమి సాయపడగలడు?

"నాయనా! కలిగినన్నాళ్లు మాతోపాటు మంచో చెడ్డో కాలక్షేపంచేశావు. ఇప్పుడు కాలమంతా తల్లక్రిందులయింది. ఏమయి నప్పటికీ, ముసిలివాళ్ళం, మే మెక్కడికి కదిలిపోగలము? ఇక్కడ మాతో మగ్గి పోవటంకంటె, కుర్రవాడివి కాన, కాటకం లేని మరోదేశం చేరుకుని బాగుపడటం మంచిదికదా! నా మాట విని నువు వెళ్లు, మేలవుతుంది" అని చెప్పి, దీవించాడు.

ఆ ప్రకారం అబ్బాస్ బయలుదేరి, సాగిపోయేసరికి, పాడుపడి అక్కడక్కడ ముక్కా చెక్కలుగా మిగిలిపోయిన ఒక పురాతనపు కోట కానవచ్చింది.

అలసివున్న అబ్బాస్‌కు, ఆ పాడు కోట లోనే పడుకొనేసరికల్లా నిద్రపట్టేసింది. నిద్దట్లో అతని బుజానికి ఏదో బరువుగా తగిలేటప్పటికి, కళ్లు విప్పిచూచాడు. ఒక చేయి ఆకారమూ, అందులో ఒక వెలుగుతూవున్న దీపమూ అతనికి కనిపించాయి. కనపడటమే కాదు. ఆ చేయి కదిలింది. ఈ చిత్రం చూచి ఆశ్చర్య పడి, అబ్బాస్ ఆ వెలుగు వెంబడే వెళ్లగా, ఒక గొప్ప భవనము అగపడింది. అతను అందులో ప్రవేశించాడు.

వి. రత్నకుమారి, కడప



మరునాడు ఉదయాన, ఆ చేయి మళ్లీ కనపడి, "అబ్బాస్! నువు ఓరిమి కల వాడివి, మంచి ధైర్యశాలివిన్ని. ఎంతో మంది ఇక్కడికి వచ్చారు, వెళ్లారు. కాని, అందులో ఒకడూ నీలాగ వెలుగు వెంబడి రాలేకపోయాడు. ఎన్ని కష్టాలు వచ్చి నప్పటికీ, సహించి, ఈ భవనంలో మూడు రాత్రులు గడిపితివంటే, ఒకానొక రాజ కుమారిని బంధమునుండి విడిపించిన వాడవు అవుతావు. అందువల్ల నీకు ఎంత యినా మేలున్నది" అని అతనితో చెప్పింది.

భవనములో లెక్కలేనన్ని గదు లున్నాయి. ఒక విశాలమయిన గదిలో వేయి రకముల పిండివంటలతో సహా భోజనము సిద్ధంగా వున్నది. అబ్బాస్ కడుపునిండా భోంచేసి, మళ్లీ వెలుగును వెంబడించాడు. అంద చందాలతో అమరి వున్న మరివొక గదిలో రకరకాల దుస్తు లున్నాయి. అబ్బాస్ తన పాత గుడ్డలు విడి చేసి, మంచి సిల్కులు తీసి ముస్తాబు చేసి కొన్నాడు. అక్కడనే దగ్గర వున్న హంస తూలికా తల్పం మీద హాయిగా పడు కొని నిద్రపోయాడు.

రాజకుమారిని విడిపించటం కోసమని అబ్బాస్ ప్రాణాలయినా అర్పించటానికి సిద్ధంగా ఉన్నాడు. రాత్రికాగానే, భోజ నాల గదిలోకి పోయి మామూలుగా భోజనం చేసుకొని, పక్కగదిలో హంసతూలికా తల్పంపయిన హాయిగా పడుకొన్నాడు. అర్ధరాత్రిసమయాన ఒక పెద్ద పటాలం వచ్చి చొరపడి, వాళ్ల చేతులలోవున్న గదలతో, సున్నంలోకి ఎముక మిగల కుండా అబ్బాస్‌ను చితకగొట్టారు. కానైతే, మరునాడు పొద్దున్నే అ చేయి మళ్లీ కన పడి, తను తెచ్చిన మందుపసరులు అబ్బాస్ వంటికి రాయడంతోనే, రాత్రి

అతను తినిన దెబ్బలన్నీ ఎక్కడివక్కడే మాయమయినాయి.

రెండవ రాత్రికూడా పటాలం వచ్చి చొరబడి, అతనిని మొదటి రోజుకంటే గట్టిగా కొట్టారు. కిక్కురుమనకుండా అబ్బాస్ దెబ్బలన్నీ ఓర్చుకొన్నాడు. మరునాడు ఉదయాన మళ్లీ ఆ చేయి వచ్చి మందు రాసింది. మూడవనాడు మళ్లీ పటాలంవచ్చి, కిందామీదా చూడకుండా అబ్బాస్‌ను చావమోదారు. నోరు మెదపక, అతనుఆబాధలన్నీ సహించాడు.

మామూలుగా ఆ చేయి మరునాడు వస్తుందని అబ్బాస్ కనిపెట్టుకొనివున్నాడు. కాని, అతను అనుకున్నట్టు రాలేదు. ఏమిటా అని అతను ఆలోచిస్తూవుండగా, గభాలున తలుపు తెరుచుకుని, ఒక రాజకుమారి అక్కడికి వచ్చింది. ఆమె తనతో తెచ్చిన మంత్రజలం అతనిపయిన చిలకరించేసరికి, తక్షణమే శరీరంమీద దెబ్బలుపోయి, అబ్బాస్ మామూలు మనిషయాడు.

ఆ సుందరి, తన చరిత్రఅంతా అతనికి వినిపించింది : "నేను ఫలానా దేశపు రాజు కూతురను. శత్రురాజులు నన్ను ఇక్కడికి రప్పించి బంధించారు. వాళ్లు ప్రయో



గించిన మంత్రాలవల్ల ఎన్నేళ్ళనించో, మైకం కమ్మి నేను పడివున్నాను. నన్ను విడిపించటానికి ఎంతోమంది వచ్చారు. కాని, మొదటిరాత్తిరి దెబ్బలకే తట్టుకోలేక పారిపోయేవారు. నీవు వాళ్ల దెబ్బలన్నిటికీ సహించగలగటంవల్ల, వాళ్ల మంత్ర బలిమి తగ్గిపోయి, నామైకం మాయమైపోయింది. మనిద్దరం ఇప్పుడు మా తండ్రి భవనానికి వెళ్లిపోవాలి" అని అనవాలు చెప్పి, ఆమె అదృశ్యమయిపోయింది.

ఆమె అదృశ్యంకాగానే, అబ్బాస్ పాడు కోటలో, మురికి బట్టలతో ఉండిపోయాడు.

రాజకుమారి తన తండ్రి భవనము చేరుకొని, అబ్బాస్‌కోసం ఎంతోకాలం ఎదురుచూచింది. చివరకు నిరాశతో, పెద్దలు ఆమెకు మరొక సంబంధం నిశ్చయించి, ప్రధానం చేసుకొన్నారు.

పెళ్లిరోజు వచ్చింది. ఊరేగింపుకని ఆమె అంబారీ ఎక్కబోతూవుండగా, తను ఎవరికోసమయితే ఇంతవరకూ తపించిందో ఆ అబ్బాస్, చింకి గుడ్డలతోనూ విచార ముఖంతోనూ కోట గుమ్మానికి ఎదట కనిపించాడు. అబ్బాస్ ఎందుకు వచ్చాడో రాజకుమారికి తప్ప మరెవ్వరికి తెలుసు?

అతనిని చూడగానే ఆమె పెళ్లికొడుకుని ఒక ప్రశ్న వేసింది. "ఇందాకా నా పెట్టె తాళపు చెవి కనపడకుండా పోయింది. అది పోయిందికదా అని కొత్తచెవి చేయించాము. కొత్తది చేయించిన వెంటనే పాత తాళపుచెవి దొరికింది. మరి, ఇప్పుడు నేను ఇందులో ఏది వాడటం న్యాయమో చెప్పవలసింది" అని అడిగింది.

అందుకు అతను "పాతది ఉపయోగించటమే సబబు" అని జవాబు చెప్పాడు.

వెంటనే రాజకుమారి, అబ్బాస్‌ను చేయిపట్టుకు తీసుకువచ్చి, అతను ఎవరో, ఏవిధంగా తనను రక్షించాడో ఆ సంగతులన్నీ చెప్పేసరికి, అందరూ ఆశ్చర్యపోయారు. తను గూఢంగా అడిగిన తాళపుచెవి సమస్య ఈ అబ్బాస్‌ను గురించేనని ఆమె వరునితో చెప్పేసరికి, అతను చాలా సంతోషించి, అబ్బాస్‌నే పెళ్లిచేసుకొనమని చెప్పి, సమ్మతి తెలిపాడు.

తెలివితేటలు, వివేకముగల రాజకుమారి తండ్రికి పరిస్థితులు విప్పిచెప్పి, ఆయన అనుమతిపొంది, అబ్బాస్‌ను పెళ్లి చేసుకొని హాయిగా వున్నది.






పూర్వకాలమందు ధారానగరంలో ధర్ముడు అనే మాదిగవాడు ఉండేవాడు. తక్కిన మాదిగలందరిలాగా ధర్ముడు కూడా చెప్పులు కుట్టుకుని జీవిస్తూవుండే వాడు. చెప్పులు కుట్టి అమ్ముకోవటమే గాకుండా, ధర్ముడికి రాత్రివేళ నగరంలో గస్తీ తిరిగే తలారిపనికూడా వున్నది. గస్తీ అంటే రాత్రంతా మేలుకుని, నగరమంతా తిరిగి, ఝాము ఝాముకీ 'దొంగలువస్తారు, జాగర్తగా వుండండీ!" అని ప్రజలను హెచ్చరించడం అన్నమాట.

ధర్ముడికి కాలక్షేపం బాగానే జరుగుతున్నది కాని, ఎన్నాళ్ళకూ సంతానం లేదనే విచారం మాత్రం ఎక్కువగా బాధిస్తున్నది.

ఆ వూళ్లోనే ఒక గొప్ప పండితుడు ఒకాయన ఉన్నాడు. ధర్ముడు గస్తీతిరగటం ముగించుకొని ఇంటికి పోయే వేళా, పండితుడు ఏటికి స్నానానికి వచ్చేవేళా ఒకటి. ఇలానే ఒకరోజున, పండితుడు ఏటికి వచ్చేసరికి, ధర్ముడు ఆయనకు దండంపెట్టి, తనకు సంతానం కలిగేటట్టు దీవించుమని ప్రార్థించాడు.

దానికి పండితుడు 'ధర్మన్నా? పిల్లలు లేరని ఎందుకోయి విచారపడతావు?

"ఋణానుబంధ రూపేణా

పశు, పత్ని, సుతాలయాః'

అన్నారు. అనగా—పెళ్లాం, పిల్లలు, గొడ్డూ, గోదం, ఇల్లూ, వాకిలీ—ఇవన్నీ కేవలమూ ఋణానుబంధంవల్లనే వస్తాయి, ఋణం తీరిపోవటంతో పోతాయి" అని చెప్పి, స్నానానికి వెళ్లిపోయాడు.

పండితుడు చేసిన బోధవల్ల ధర్ముడికి వైరాగ్యం కలగలేదు సరికదా, ఒక వుపాయం తట్టింది: "నాసొమ్ము ఎవడయినా అనుభవించి, దానికి ప్రతిఫలం

పాలంకి వెంకటరామచంద్రమూర్తి – మదరాసు.



ఇవ్వలేకపోతే వాడు నాకు ఋణపడతాడు. అప్పుడు వాడు నాకడుపున పుట్టి ఋణం తీర్చుకొనక తప్పదు కద! ఈ విధంగా, నాకు సంతానం కలగటానికి అవకాశ మున్నది" అని ధర్ముడు సంతోషించాడు.

ఈ వుద్దేశం మనస్సులో పెట్టుకొని, ధర్మన్న తయారుచేసిన చెప్పుల జతలను తనవద్దకు వచ్చేవాళ్లకు డబ్బుపుచ్చుకోకుండా ఊరికే ఇద్దామని ప్రయత్నించాడు. ఆ వచ్చిన వాళ్లు "ఉత్తపుణ్యానికి నీ చెప్పులు పుచ్చుకొని, నీ ఋణాన పడి వుండటానికి మాకేమంత గ్రహచారం!" అని, మరొకచోటికిపోయి కొనుక్కునే వాళ్లు. ఇలాగ, ధర్మన్నవద్దకువచ్చే బేరా లన్నీ పైకి పోతూవచ్చాయి.

ఇది పనికాదనుక్కొని ధర్మన్న మరొక వుపాయం పన్నాడు. 'ఊరికీ ఏరుకీ మధ్యని ఇసికపర్ర ఇంచుమించు కోసున్నరదూరం వున్నదికదా! ఒక మంచి చెప్పులజత ఆ మధ్యదారిలో పెట్టివస్తాను. మిట్టమధ్యాహ్నము ఒక్కడైనా జోడులేకండా ఆ దారిని రాకపోతాడా? ఈ చెప్పులజత తొడుక్కోక పోతాడా? ఇక, ఆ తొడుక్కున్న వాడు నాకు ఋణపడక ఏమి చేస్తాడు? అని ఆలోచన చేశాడు.

ఈ ఆలోచనతో ధర్మన్న ఉదయానే కొత్తచెప్పుల జత ఒకటి పట్టుకువెళ్లి, ఇసిక పర్రలో నడిదారిలో పెట్టాడు. సాయంత్రం వెళ్లి చూస్తే, ఎక్కడ పెట్టిన జోడు అక్కడనే వున్నది. ఎన్నాళ్ళు చూసినా, చెప్పులు ఎవళ్ళూ తొడుగుకుని పోయేట్టు కనపడలేదు. 'అయ్యో, నాకిక సంతాన ప్రాప్తి లేదుకామాలు. లేకపోతే, ఒక్కడు కూడా జోడు తొడుగుకొనక పోవటమేమిటి, నాకు ఋణపడకపోవట మేమిటి?' అనుకొని ధర్మన్న నిరాశ చెందాడు.

అయినా, పట్టుదల గల ధర్మన్న మరి కొంతకాలం చూదామని నిశ్చయించాడు. మామూలు ప్రకారం, చెప్పులజత నడి దారిలో పెట్టి, రోజూ సాయంత్రంవెళ్లి, అది ఏమయిందోనని చూస్తూవుండేవాడు.

ఒకరోజున అలానే సాయంత్రంపోయి చూచేసరికి, చెప్పులజత అగపడలేదు. 'నేను వేసిన పాచిక ఇన్నాళ్లకు పారింది, నా అదృష్టం పండింది!' అని అనుకొంటూ ధర్మన్న ఇంటికి వెళ్లి, ఈ సంతోషవార్త భార్యతో చెప్పాడు. ఆమె ఈ మాటవిని పొంగిపోయింది.

ఆయితే ఇంతకూ, ఆ చెప్పులజతను ఎవరు తీసుకున్నదీ ధర్మన్నకు తెలియ లేదు. తెలుసుకోవాలనే ఆదుర్దాకూడా వాడికి లేదు.

*　　*　　*

ఋణానుబంధాన్ని గురించి ధర్మన్నకు బోధచేసిన పండితుడు ఒకనాడు జరుగురు పనిమీద పొరుగూరు వెళ్లవలసి వచ్చింది. ఆయన పనిచూచుకొని తిరిగి వచ్చేసరికి సరీగా మధ్యాహ్నం రెండు ఝాములయింది. పండితునికి చెప్పులు లేక పోవటంమూలాన అరికాళ్ళు చుర్రుమని




బొబ్బలెక్కినయి. ఇంతలో ధర్మన్న చెప్పులజత అక్కడ కనపడగా, ఇది దేవుడుచేసిన ఏర్పాటేనని భావించి పండితుడు ఆ జోడు తొడుక్కున్నాడు.

"ఎవడో మాదిగ వీటిని అమ్మకానికి తెచ్చి ఇక్కడ పెట్టివుంటాడు" అని అనుకొని, చాలాసేపు ఎండలో వాడికోసం ఎదురు చూస్తూ నించున్నాడు. కాని, ఎవ్వరూ ఆయనకు కనపడలేదు. 'సరే, జోడు ఎవరు పెట్టిందీ ఊళ్లో కనుక్కొని డబ్బు ఇచ్చెయ్యవచ్చు'నని తలిచి, పండితుడు ఇంటికి చేరుకున్నాడు



సాయంత్రం ఊళ్లో మాదిగవాళ్ల నంద రినీ వాకబుచేసాడు కాని, వాళ్ళందరూ 'మాకు తెలియ'దంటే 'మాకు తెలియదు' అనేశారు. తను చేసినపని ఎక్కడ తెలిసి పోతుందో ననే భయంకొద్దీ ధర్ముడు కొన్నాళ్ళవరకూ పండితుని కంటపడటమే మానివేశాడు.

చెప్పుల తాలూకు ఋణం ఎవడికి తీర్చుకోవాలో ఎంత ప్రయత్నించినా, పండితుడికి తెలియక, చాలా కించపడ్డాడు. మరి కొద్దిరోజులకు ఆయనకు జబ్బుచేసి పాపం, మరణించాడు. ఋణం తీర్చుకోవడంకోసం పండితుడు ధర్ముడి భార్య కడుపున పడవలసి వచ్చింది!

*   *   *

ధర్ముడి భార్య పున్నమచంద్రునివంటి మగశిశువును కన్నది. గూడెంలో అందరూ సంతోషించి, వేడుకలన్నీ జరిపారు. తల్లీ తండ్రీ పిల్లవాడిని చూచుకుని మురిసి పోయారు. వాడికి సంగడని పేరుపెట్టారు.

సంగడు క్రమంగా పెరిగి పెద్దవాడయి, తండ్రికిమల్లేనే చెప్పులు కుట్టి, బజారులో అమ్ముకొనివచ్చేవాడు. అలా అమ్మకు వచ్చిన డబ్బు తండ్రికి ఇవ్వటోతే ధర్మన్న పుచ్చుకొనేవాడు కాదు.

ఏమీ అంటే—కుమారునివద్ద డబ్బు తీసుకున్నట్టయితే వానికీ తనకూ ఋణం తీరిపోతుందనీ, తీరిపోయినట్టయితే తనకు వాడు దక్కడనీ ధర్ముని భయం. ఈ రహస్యం ధర్ముడు భార్యతోకూడా చెప్పి, కుమారుడు సంపాదించి తెచ్చిన సొమ్ము ఎన్నడూ తాకవద్దని హెచ్చరించాడు.

పూర్వజన్మంలో తను ఫలానా పండితుడ నన్న సంగతి సంగన్నకు తెలుసు. తను ధర్ముడి ఇంట పుట్టడానికి గల కారణం కూడా తెలుసు. 'ఎంత త్వరలో ఆ చెప్పుల

ఋణం తీర్చుకుంటానా, ఎంత వేగంగా ఈజన్మ చాలించుకుంటానా!' అని సంగన్న ఆత్రపడేవాడు. కాని, అతను సంపాదించు కొచ్చింది తలిదండ్రులు పుచ్చుకొనక పోవటంవల్ల, అనుకున్నంత త్వరగా అతనికి ఋణానుబంధం తీరడంలేదు.

ఇలావుండగా, ధర్మన్న ఒకనాడు ఊరికి పోవలసివచ్చింది. అతను కుమారుణ్ని పిలిచి, "నాయనా!–నేను పూరికి పోతున్నాను. రేపటిరాత్రి నాబదులు నువ్వు నగరంలో గస్తీ తిరిగి, నాలుగు ఝాములా ప్రజలను మేల్కొలపవలిసింది" అని చెప్పాడు.

తండ్రి చెప్పిన ప్రకారం, సంగన్న ఆ రాత్రి నగరంలో గస్తీ తిరగటానికి వెళ్లాడు. అతనికి తోడువచ్చిన తలారి "సంగన్నా! ఇప్పుడు ఝాముురాత్రి అయింది. ప్రజలంతా నిద్రలోవున్నారు. జాగ్రత్తగా ఉండమని కేకవెయ్యి" అన్నాడు. అప్పుడు, సంగన్న రూపంలో ఉన్న ఆ పండితుడు-

"మాతా నాస్తి పితా నాస్తి
నాస్తి బంధు సహోదరః
అర్థం నాస్తి గృహం నాస్తి,
తస్మాత్ జాగ్రత ! జాగ్రత !!"



అని కంఠమెత్తి, అందరకూ మెలకువ వచ్చేటట్టు శ్లోకం చెప్పాడు.

కూడా వచ్చిన తలారికి ఆశ్చర్యంవేసి, 'ఈ శ్లోకానికి అర్థం ఏమిటి?' అని అడిగాడు. దానికి సంగన్న "తల్లిలేదు, తండ్రీలేదు, చుట్టాలూ సోదరులూలేరు, ధనమూలేదు, ఇల్లూలేదు, ఇవన్నీ ఉత్త మాయ. కనుక, ఈ మాయనుండి మేలుకొని, జాగ్రత్తగా వుండండి" అని అర్థం చెప్పాడు.

సంగన్న ఈ వేదాంతం బోధించేసరికి, రెండో ఝాము గడిచిపోవచ్చింది. అప్పుడు అతను—



ఈ అర్థం వినేవరకు, పక్కనివున్న తలారివానికి ఆశ్చర్య మనిపించింది. 'ఓయి సంగన్నా! నీమాటలన్నీ విడ్డూరంగా వున్నాయి. ఇంతకాలంనించీ మీబాబు, చెంబూ తప్పేలా ఎత్తుకపోయే దొంగలను గురించి చెప్పాడు. కాని, ఇటువంటి దొంగలను గురించి ఎప్పుడూ చెప్పనేలేదు. ఇన్ని చిత్రాలు ఎప్పుడు నేర్చినావో గమ్మత్తుగా వున్నది" అంటూ, ఆశ్చర్యాన్ని తెలిపాడు.

మూడవ ఝాము గడిచేసరికి సంగన్న మరివక శ్లోకం ఇలాచెప్పి ప్రజలను హెచ్చరించాడు :—

"జన్మ దుఃఖం జరాదుఃఖం
జాయా దుఃఖం పునః పునః
సంసార సాగరం దుఃఖం
తస్మాత్ జాగ్రత జాగ్రత!"

ఇదివిని తోడివానికి మరీ ఆశ్చర్యం కలిగింది. 'ఏమిటోయి సంగన్నా! ఇన్ని రకాల దుఃఖాలు ఏకరు పెడుతున్నావు. వీటికి కూడా కాస్త అర్థం చెబుదూ' అని అతను కోరగా, దానికి సంగన్న— "జన్మ ఎత్తడం ఒక దుఃఖం, తరవాత భార్యతో ఉండటం ఒక దుఃఖం, ముసిలితనం రాగానే అదొక దుఃఖం. ఇలా ఒక

"కామక్రోధశ్చ లోభశ్చ
దేహే తిష్ఠన్తి తస్కరాః
జ్ఞానరత్నాపహారాయ
తస్మాత్ జాగ్రత, జాగ్రత!"

అని శ్లోకంచదివి మళ్లీ ప్రజల్ని మేలుకొలిపాడు. ఇతను ఇంత చదువు ఎప్పుడు చదివాడా అని తోడివానికి ఆశ్చర్యమై, ఈ శ్లోకానికి అర్థంచెప్పమని కూర్చున్నాడు.

"కామం, క్రోధం, లోభం అనే దొంగలు, జ్ఞానమనే రత్నాన్ని అపహరించటంకోసం మనదేహంలో దాగివున్నారు. జాగ్రత్త!" అని సంగన్న అర్థం చెప్పాడు.

దాని వెంట మరొక దుఃఖం వస్తూనే వుంటుంది. అసలు, దుఃఖములు అనే కెరటాలతో కూడుకొనివున్న సంసారమనే సముద్రమే అన్నిటికన్న పెద్ద దుఃఖం. కనుక, ఈ సంసార సాగరంలో పడి పోకుండా, మేలుకుని జాగర్తగా వుండండి!!" అని హెచ్చరించాను అన్నాడు.

దీనికి తోడివాడు "మీ బాబు పిల్లను తెచ్చి నీకు పెళ్లిచేదా మనుకుంటూవుంటే ఇలా మెట్టవేదాంతం మొదలెట్టావేమిటి?" అని అనేటంతలో నాలుగో ఝాముకూడా అయిపోవచ్చింది. అప్పుడు సంగన్న—

"ఆశయా బద్ధతే లోకే
కర్మణా బహు చింతయా
ఆయుః క్షీణం నజానాతి
తస్మాత్ జాగ్రత! జాగ్రత!!"

అని శ్లోకం చెప్పి గస్తీ ముగించాడు. ఇది వినగానే తోడివాడు మరీ అబ్బురపడినాడు. సంగన్నయొక్క జ్ఞానం, పాండిత్యం, అతనికి విస్మయం కొలిపాయి. ఈ శ్లోకానికికూడా అర్థంచెప్పమని తోడివాడు కోరేసరికి, సంగన్న—"కర్మచేత, చింత చేత, ఆశచేత, ఈ లోకం బంధించబడుతున్నది. వీటిలో చిక్కుకొనిపోయిన ప్రజలు



క్షణక్షణానికి వారి ఆయువు క్షీణిస్తూవున్న సంగతి కానలేకపోతున్నారు. ఈ సంగతి తెలుసుకొని అందరూ జాగ్రత్తపడాలి" అంటూ విప్పిచెప్పాడు.

ఆ పట్టణాన్ని ఏలుతున్న రాజుగారు, సంగడు మొదట చెప్పిన శ్లోకం విన్నాడు. ఆయనకు ఆశ్చర్యంవేసింది. ఇంకా ఏమైనను చెప్పుతాడేమో నని మేలుకొన్నాడు. అతనికి మిగతా మూడు శ్లోకాలుకూడా వినిపించినవి.

తెల్లవారగానే, రాజుగారు 'రాత్రి గస్తీ తిరిగిన తలారివాడిని తీసుకరమ్మని అజ్ఞా

పించారు. సంగన్న రాజావారి దర్శనానికి వెళ్ళగానే, ఆయన సంగన్నకు నమస్కరించి, 'మీరెవరో మహానుభావులుగాని, సామాన్యులు కారు. తలారికేమిటి, ఇంత అద్భుతమైన పాండిత్యమేమిటి?నాయందు దయవుంచి ఈ కానుకను పుచ్చుకొని దీవించండి!' అని అంటూ, వరహాలతో నిండివున్న ఒక సంచి అతని కిచ్చారు.

అయితే, సంగన్న ఈధనం ఏమిచేసుకొంటాడు? తనకు పనిలేకపోయినా, దీనిని తలిదండ్రులకు ఇచ్చి, ఋణం తీర్చుకో వచ్చుననే వుద్దేశంతో సంచీ తీసుకున్నాడు.

మరునాడు ఊరినుంచి ధర్మన్న వచ్చాడు, తను తెచ్చిన సొమ్ము తండ్రికి ఇద్దామంటే, అతను తీసుకొనడని సంగన్నకు తెలుసుగా? ఏమిటా ఉపాయమూ అని ఆలోచిస్తూవుండగా, మాదిగవాడలో కొంపలు అంటుకొన్నాయి. తలారివాళ్లంతా సామానులు తగలడిపోకుండా బయట పడవేస్తున్నారు. సంగన్నకూడా ఇంటిలో నించి ఒకొక్క సామానే తెచ్చి తండ్రికి అందిస్తున్నాడు. ధర్ముడు వాటిని అందుకుని అవతల సర్దుతున్నాడు.

ఈ సందడిలో సంగన్న తను రాజుగారి వద్ద బహుమతీ పొందిన వరహాల సంచీ కూడా తండ్రికి అందించాడు. ఆ కంగారులో, 'ఇదేమిటి?' అనే సందేహం పెట్టుకోకుండా, తక్కిన సామానులతో పాటు ఈ సంచీకూడా ధర్ముడు సర్దేశాడు.

అంతటితో తన ఋణం తీరిపోయింది కదా అనే సంతోషంతో, సంగన్న ఆ జ్వాలలో పడి, జన్మ చాలించుకొన్నాడు.

చివరకు, కొన్నాళ్లయినతరవాత ధర్ముడికి ఈ సంగతులన్నీ ఒకటొకటే తెలిసి వచ్చాయి. పండితుని బోధ జ్ఞాపకం చేసుకుని అతడుకూడా జ్ఞానవంతు డైనాడు.






# వనలక్ష్మి

అనగా అనగా ప్రసన్న అనే అందాల బాలిక వుండేది. ఆమె చాలా చురుకైనది. ఆ పిల్ల సముద్రపుఒడ్డున నాగకన్యలతో ఆడుకొనేది. ఆమెతల్లి వనలక్ష్మి. భూలోక మందు వనలక్ష్మి 'పండూ' అంటే పంటలు పండుతాయి, లేకుంటే లేదు. 'పూయీ' అంటే పువ్వులు పూస్తాయి, లేకపోతే లేదు. అందుకనే ఆమె పేరు వనలక్ష్మి.

ఒకనాడు వనలక్ష్మి కూతురుతో "అమ్మాయీ! ఇప్పుడు వరిచేలు కోతలకు వచ్చాయి. కనుక ఈ సమయంలో నేను వాటిని కాపాడి, ఏటికేడాదీ రాత్రింబగళ్ళు కష్టపడిన రయితులకి సాయపడాలి. నువు నాగకన్యలతో ఆడుకొంటూవుండు. కాని, వాళ్లను విడిచి ఒక్కతెవూ మాత్రం ఎక్కడకూ పోబోకు" అని చెప్పింది.

'అలాగేలే' అంటూ ప్రసన్న, ఉత్సాహంతో గెంతులేసుకుంటూ వెళ్లిపోయింది. ప్రసన్న గొంతు వినపడగానే ఆమె నేస్తులయిన నాగకన్యలు బిలబిలమంటూ వచ్చేసి ఇసికలో కూర్చున్నారు. వాళ్ళు కొంతసేపు పిచ్చికగూళ్లు కట్టుకొన్నారు. మళ్లీ వాటిని పడగొట్టివేశారు. తరువాత నాగకన్య లందరూ తాము తీసుకువచ్చిన నత్తగుల్లలతో ఒక అందమయిన దండ గుచ్చి, దానిని ప్రసన్న కంఠానికి తగిలించారు. ప్రసన్న పూలతోటలోనించి తెచ్చిన పూలతో మాలికలుచేసి వాళ్లకు వేసింది.

ఈవిధంగా వాళ్ళు చాలాసేపు ఆడుకొన్నాక వాళ్లతో ప్రసన్న "మనం ఇంకా కొంచెం దూరం వెళదాం, రండి. అక్కడ రకరకాల పువ్వులూ వింతవింత పువ్వులూ ఉన్నాయి. చక్కా దండలు గుచ్చుకుని ఆడుకుందాం" అని పిలిచింది.

అందుకు వాళ్లు "తడి జాగా దాటి పొడిగా వుండే చోటుకి వస్తే మాకు జబ్బు

యస్. పార్వతీబాయి, అనంతపురం



చేస్తుంది. కనుక మేము రాము." అని కచ్చితంగా చెప్పేశారు.

అప్పుడు ప్రసన్న "సరే, మీరిక్కడనే ఉండండి, అదిగో ఆ తోటకు వెళ్లి మంచి మంచి పుష్పాలు కోసి నిమిషంలో పట్టుక వస్తాను." అని అంటూ, పరుగుచ్చుకున్నది. చెప్పినట్టుగానే విచిత్రమయిన పువ్వులు ఒడిలో నింపుకొని ఆమె తిరిగి వస్తూవుంటే, దారిలో చాలా సుందరమయిన ఒక పువ్వులగుత్తి కంటపడింది. ఒక్క గుత్తికి పంచపువ్వులు ఉండటం చూసి ఆమెకు చాలా ఆనందమయింది.

'ఇటువంటి వింత పువ్వు విత్తనం ఉండాలి కాని, పువ్వుమాత్రం పట్టుకెళితే చాలదు' అని అనుకొని, మొక్క పళాన లాగివేయటానికి ప్రయత్నించింది.

ప్రసన్న కష్టపడి లాగగా, కొంతసేపటికి మొక్క వేళ్ళతోసహా ఊడిపచ్చింది కాని, ఆ ఊడివచ్చిన రంధ్రం, చూస్తూవుండగానే పెద్దదయిపోయి, భూమి కిందినించి పెళ పెళమనే ధ్వనికూడా వినపడింది.

క్రమంగా ప్రసన్నకు గుర్రాలు పరుగెత్తుతున్నట్టు, రథం నడుస్తున్నట్టుకూడా అలికిడి అయింది. కావడమేమిటి? మరొక్క చిటికసేపటిలో మూడు నల్లగుర్రాల రథంలో పాతాళలోకాన్ని ఏలే రాజు అక్కడికి వచ్చేశాడు. ఆమె భయపడి 'అమ్మా అమ్మా!'' అని కేకలువేసింది. కాని వనలక్ష్మికి ఈ కేక వినపడలేదు.

ఇంతలో పాతాళరాజు ప్రసన్నను పట్టి రథంపయిన కూర్చోబెట్టుకుని, వాయువేగంతో తన లోకానికి తీసుకుపోయాడు. ఆమె బెంగతోనూ భయముతోనూ ఎడతెరపిలేకుండా ఏడవటంచూసి, రాజు "ప్రసన్నా! నీవు నాకు రాణిగా ఉండు. నీవు ఏమికోరినా సరే, క్షణంలో తెచ్చి

ఇస్తాను. నీకు వచ్చిన భయమేమీలేదు. అని అనేకవిధాల నచ్చజెప్పాడు.

"ఏమయినాసరే, నేనిక్కడ ఉండను. నన్ను మా అమ్మదగ్గరదిగబెట్టివేయం"డని ప్రసన్న పోరుపెట్టింది.

* * *

కొంతసేపటికి వనలక్ష్మివచ్చి కూతురుని పిలిచింది. ప్రసన్న పలకలేదు. సముద్రపు ఒడ్డుకివచ్చి ఆమెతో రోజూ ఆడుకొనే నాగ కన్యలను అడిగింది. వాళ్లు జరిగిన సంగతంతా చెప్పారు. అప్పుడు వనలక్ష్మి 'ఇది కొంటెపిల్ల. ఒక్కర్తె ఎక్కడికో పోయి వుంటుంది. ఏమి ఆపద వచ్చిందో!" అని అనుకొని చాలా విచారించింది. తొమ్మిది రాత్రిళ్ళు, తొమ్మిది పగళ్ళూ నిద్రాహారాలు లేకుండా ముద్దులకూతురుకోసం దివ్వె చేతపట్టుకొని భూలోకమంతా తిరిగింది.

పోగాపోగా, ఆమెకు చందమామ కన పడ్డాడు. ఆయన్ని అడిగితే, "ప్రసన్న కేకలు వినపడ్డాయి కాని, ఎటుపోయిందో తెలియదు. పగటిపూట ప్రపంచంలో జరిగే సంగతులన్నీ సూర్యమహారాజుకి తెలుస్తాయి. కనుక ఆయనను కనుక్కో" మన్నాడు.



వనలక్ష్మి సూర్యమహారాజు వద్దకు వెళ్లి సంగతులన్నీ చెప్పింది. అందుకాయన "తల్లీ! నువు బెంగపెట్టుకొనక్కరలేదు. అమ్మడు పాతాళలోకంలో సురక్షితంగా వున్నది. ఆమెను రాణిగా చేసుకుందామని ఆరాజు ఎత్తుకుపోయాడు" అని పాతాళ లోకం ఆనవాలు చెప్పాడు.

ఈవార్త వినేసరికి వనలక్ష్మికి పట్టరాని కోపం వచ్చింది. "పాతాళరాజు నాముద్దుల కూతురుని తెచ్చి వప్పగించేవరకూ భూలోకంలో మళ్లీ పంటలు పండకూడదు. చెట్లు కాయకూడదు, పూవులు పూయకూడదు.



ఇదే నా ఆజ్ఞ" అని చెప్పి వనలక్ష్మి శపించివేసి, కదలకుండా మాటాడకుండా దివ్వెచేతపట్టుకుని అలానే విచారముతోను, కోపముతోను, పట్టుదలతోను కూర్చున్నది.

ఆక్షణంనించీ భూమిపయిన ఒక్క గడ్డిపరకకూడా మొలవడం మానివేసింది. రైతు ఎంత కష్టపడితేమటుకి ఏంలాభం? ఈవిధంగా పంటలు లేకపోయేసరికి దేశంలో కరువువచ్చి జనం మలమల మాడిపోసాగారు.

రక్షించమంటూ జనులు దేవతలను ప్రార్థించగా, వారు అనేకవిధాల వనలక్ష్మితో 'కోపగించవద్దనీ, పంటలు మామూలుగా పండనీయవలసిందనీ' కోరారు. కాని ఎవరు ఏమిచెప్పినా ఆమె చెవినిపెట్టలేదు. అప్పుడు అందరూ ఆలోచించి, ప్రసన్నను తిరిగితీసుకురావటానికి రాయబారిని పంపించారు.

* * *

అక్కడ పాతాళరాజు ప్రసన్నను ఎంతో లాలించి దయగా చూస్తున్నాడు. ఎప్పటికయినా ఆమెకు తనమీద ప్రేమ కలుగకపోతుందా అని అయన ఆశ. కాని, రాజు సొమ్ము చీపురుముల్లంతయినా, తనకు చెందినట్టయితే ఆయనకి ఋణపడిపోవలసి వస్తుందనే జంకుతో ప్రసన్న పచ్చి మంచినీళ్ళయినా ముట్టేదికాదు.

ఎంతో విలవయినవీ, అపురూపమైనవీ తినుబండారాలు ప్రత్యేకంగా తయారు చేయించి "ప్రసన్నా! ఇప్పటివరకూ నువు ఇక్కడ ఒక్క కణమైనా కొరక్కపోవడం బాగులేదు. ఇదుగో ఇవితిను, నాకు సంతోషంగా వుంటుంది" అని ఆమె ముందు ఉంచాడు. "నాకివేమీవద్దు. మా అమ్మ తోటలోపండు కావాలి. నన్ను తీసుకుపోయి భూలోకంలో వదిలేయం"డని కోరింది.

"అలాకాదు, మీ తోటలోపళ్ళు నేనే ఇక్కడికే తెప్పించుతాను" అని అంటూ, ఈ పనీమీద అనేకమంది భటులను పంపించాడు. అంతమంది భటులూ వెళ్ళి, భూలోకం అంతా వెతికి ఒక ఎండిపోయిన దానిమ్మపండు పట్టుకురాగలిగారు.

ఆ పండు చూడగానే, ఆకలితో వున్న ప్రసన్న, ఒక తప్పుధనుకొని, అందులోవి ఆరు గింజలు తీసుకుని, నోట్లో వేసుకు చప్పరించింది.

ఇంతలో ప్రజలుపంపిన రాయబారి కోటలోకి వచ్చి, ప్రసన్నను తల్లిపద్దకు రమ్మన్నాడు. తన చేతిలోవున్న దానిమ్మ పండువేపు చూచి తొందరపడి ఆరు గింజలూ నోట్లో వేసుకున్నందుకు ఆమె విచారించింది. ఆమె ఆ గింజలు తినటం చూచి, పాతాళరాజు సంతోషించాడు.

"సరే, ప్రసన్నా!—నీకంతగా వెళ్ళి పోవాలని ఉంటె వెళ్లిపోవచ్చు. కాని, నా రాజ్యంలో ఆరు దానిమ్మగింజలు తిన్నావు గనుక, ఏడాదిలో ఆరు నెలలు ఇక్కడికి వచ్చి నాతోపాటు వుండాలి" అన్నాడు.

'సరే' నని ప్రసన్న రాయబారి వెంబడి వెళ్లిపోయింది. ప్రసన్న తల్లిని చూడగానే



ఆమె ఒడిలో దూరిపోయింది. కూతురు కంటపడగానే వనలక్ష్మికి కోపమంతా మాయ మైపోయింది. ఆమె పెట్టిన శాపం వెంటనే తీసివేసింది. తక్షణమే భూలోకమంతా కన్నుల వైకుంఠంగా, పచ్చటి పైరులతో అందమైనపువ్వులతోమళ్లీ కలకలలాడింది.

పాతాళరాజు పెట్టిన షరతు విని, వన లక్ష్మికి కోపంవచ్చింది. కాని, ప్రసన్న "అమ్మా! ఇందుకోసం నువు బెంగపెట్టుకో పద్దు, ఆయన చాలా దయకలవాడు. నాకు ఏ లోపమూ చేయడంలేదు," అని చెప్పే సరికి, వనలక్ష్మి ఆ మాటకు వొప్పుకుంది.



# మంత్రుల మార్పు

పూర్వకాలమందు ఒక మహారణ్యానికి, పులి రాజుగా వుండేది. పులికింద మంత్రి ఒక రామచిలుక. చిలుకకు దయ, దాతృత్వము, ఉపకార బుద్ధీ ఉండటం చేత, ఎవరువచ్చినా లేదనకుండా, రాజుగారితో చెప్పి తృణమో పణమో ఇప్పిస్తూ వుండేది.

అందుకని, చిలుక హయాములో పులిరాజుకీర్తి దేశదేశాల వ్యాపించింది.

ఇలా వుండగా—రాజుగారి కీర్తి వినిన ఒక పేదబ్రాహ్మడు చాలాదూరంనించి ఈ అరణ్యానికి వచ్చి, చిలుకమంత్రిని ఆశ్రయించాడు. బాహ్మడి అవస్థ తెలుసుకుని చిలుక జాలిపడింది. పులిరాజు సంతోషంగా వుండే సమయంలో అతన్నిగురించి అనుకూలంగా రెండు మాటలు చెప్పేసరికి, "సరే, దానికేముంది! దరిద్రంతో కష్టపడుతున్న వాళ్లకు మనం గాకుంటే మరెవళ్లు సహాయం చేసేది? బ్రాహ్మడివి సంతోషపెట్టి పంపించవలిసింది'' అని రాజు చిలుకతో చెప్పాడు.

అప్పుడు చిలుకమంత్రి అతనికి కొల్లలుగా ధనమిచ్చి పంపింది.

ఈ ధనం పట్టుకుపోయి, బ్రాహ్మడు ఏలోపమూ లేకుండా కుటుంబాన్ని పోషించుకొంటున్నాడు. కాని, కొంతకాలం అయేసరికి ద్రవ్యమంతా ఖర్చయిపోయి, మళ్లా అతను ఎప్పటిలాగ దరిద్రునిగా తయారయినాడు.

అయితే, ఈ సమయంలో ధర్మబుద్ధిగల చిలుకమంత్రీ, ఔదార్యం గల పులిరాజూ జ్ఞాపకానికి వచ్చి, బ్రాహ్మడు మరొకసారి అరణ్యానికి బయలుదేరాడు.

ఈసారి అతను పులిరాజు దివాణానికి పోయేసరికి అక్కడ చిలుకమంత్రికి బదులుగా కాకిమంత్రి కూర్చుని వున్నది.

జి. సీతాదేవి, నాగపూరు

బ్రాహ్మడు కాకిమంత్రివద్దకు వెళ్ళి, తను వచ్చిన పని చెప్పుకున్నాడు. "బ్రాహ్మలను సత్కరించటంకంటే పుణ్యకార్యం మరేమిటున్నది? మిమ్మలినిగురించి రాజు గారితో చెప్పివస్తాను. దయచేసి అలా కూర్చోండి" అని చెప్పి, కాకిమంత్రి పులివద్దకు వెళ్ళింది.

"పులిరాజా! ఇన్నాళ్లకు మళ్ళీ కోరనికోరికగా నరమాంసం మనకు లభించింది. పిక్కబలిసిన బొజ్జ బ్రాహ్మడు తమ దర్శనానికి రాబోతున్నాడు. అతనిని తగువిధంగా సత్కరించండి" అని సలహా ఇచ్చిపోయి, బ్రాహ్మడిని పులివద్ద ప్రవేశ పెట్టింది.

బ్రాహ్మడు రాగానే పులి ఉరుములాగా గాండ్రించి, అతనిపయిన ఉరకబోయింది. అప్పుడు బ్రాహ్మడు హడలిపోతూ చేతులు జోడించి, "ఇదేమిటి పులిరాజా, ఈ విడ్డూరం! పూర్వం నేను దర్శనం చేసు కున్నప్పుడు ఎంతో దయతో ఆదరించారు. ధనమిచ్చి సత్కరించారు. మీ ధర్మమా అని పిల్లలూ మేమూ ఇప్పటివరకూ హాయిగా మీపేరు చెప్పుకొని కాలక్షేపం చేశాము. ఏదో ఇప్పుడుకూడా అలానే కటాకించి



ఏలినవారు సహాయం చేస్తారనీ, దరిద్రబాధ పోగొడతారనీ వచ్చి ఆశ్రయించాను కాని పేదవాడిని కబళించివేస్తారని తెలిస్తే ఇంతదూరం వస్తానా?" అని అనేసరికి, బ్రాహ్మడిపైన జాలి కలిగి పులి వెనక్కు తగ్గింది.

"ఓయి పిచ్చిబ్రాహ్మడా! పూర్వానికీ యిప్పటికీ ఎంత మార్పున్నదో తెలుసుకో లేకపోయినావేమయ్యా? కాలం మారింది, ధర్మం మారింది, మా అస్థానంలో మంత్రులు మారిపోయారు. రాజు అంటే ఏమిటనుకొన్నావు! కాలాన్నిబట్టి, మంత్రుల సలహాలప్రకారం నడుచుకుంటేనే రాజుకి రోజులు వెళతాయి. నిరుడు వుండిన మంత్రుల సలహాప్రకారం నీకు సత్కారం జరిగింది. ఇప్పటి మంత్రుల సలహాను పుచ్చుకొని నేను ఇలాచేయవలసివచ్చింది. ఐనప్పటికీ, నువ్వు లోగడ మాసొమ్ము తిని వుండటంచేత నీకూమాకూ సంబంధం ఏర్పడివున్నది. కనుక, నిన్ను కరుణించి వదిలెయటమే ఇప్పటిలో గొప్ప సత్కారమన్నమాట. అలస్యంచేయక రెండవ కంటికి తెలియకుండా పారిపో" అని అనేసరికి, బ్రతుకుజీవుడా అనుకొని, బ్రాహ్మడు పరుగుచ్చుకొని ఇల్లు చేరుకున్నాడు.

ఈసారి ఏమిమూట తెస్తాడోనని ఆత్రంగా చూస్తున్న బ్రాహ్మడి భార్యకు ఈ సంగతి సందర్భాలు తెలియగానే ఆమె గుండె నీరయిపోయింది.

'ఇంకా నయం, పులిరాజుగారు మింగివేయకుండా బయటపడ్డారు. అదే పదివేలు. బతికివుంటే బలుసాకు ఏరుకుని తినవచ్చు. మంచి మంత్రులు వుండే మరొక రాజును ఆశ్రయించవచ్చు,' అని ఆమె, భర్తకు గండం తప్పించినందుకు ముక్కోటి దేవతలకూ మొక్కుకొన్నది.



# చందమామ పజిల్

(భాషాభివృద్ధికి)

## ఆధారములు

### అడ్డము

2. వాడియైన పెద్ద ఆయుధము
4. క్రమము
6. రుక్మిణి అన్న
7. స్త్రీలు
9. విడుదల పొందినవారు
11. ఒక అంకె
12. మానవుడు
14. ఋషి




### నిలువు :

1. జలము
3. జుట్టు
4. వేగము
5. సాగరము
8. అకస్మికముగా
9. ఒక తిథి
10. హాని
13. చవి

## ముగ్గులు



బి. శకుంతల, వరంగల్



పి. వసంత, కుర్దారోడ్




# పిల్లల పెంపకం

## నడవడి

బిడ్డల నడవడి వాళ్ల అలవాటులనుబట్టి వుంటుంది. అలవాటులు అనేవి పిల్లల శారీరక, మానసిక శిక్షణనుబట్టి ఏర్పడతాయి. కనుక, పిల్లలు మంచి అలవాటులను చేసుకొనేటట్టు చూడవలసిన బాధ్యత తలిదండ్రులమీదనే వున్నది.

బిడ్డల అభివృద్ధికి, అలవాటులకు స్హాయపడే విషయాలు అనేకం ఉన్నాయి. అందులో - పిల్లలకు ఇచ్చే ఆహారం ఎంత ముఖ్యమో, మీరు వారిపై చూపే ఆదరమూ, అభిమానమూ అంత ముఖ్యం. 'నా తలిదండ్రులకు నాపైన ఎంతో ప్రేమ. కనుకనే నాకు ఈ ఇల్లు స్వర్గంలా వున్నది' అని బిడ్డకు నమ్మకం తోచాలి. తలిదండ్రులయందు విశ్వాసం కుదరాలి.

పసిబిడ్డలకు గ్రహింపుశక్తి అపారంగా వుంటుంది. పెద్దవాళ్లకంటేకూడ అతి సూక్ష్మంగా వాళ్లు సంగతి సందర్భాలు గ్రహించగలరు. తలిదండ్రులు తనపట్ల అభిమానంగా వుంటున్నదీ లేనిదీ వాళ్లు ఇట్టే తెలుసుకోగలరు. పిల్లలనుగురించి విసుగుకున్నా, తలిదండ్రులు బాధపడుతున్నా, వాళ్లు సులువుగా పసికట్టగలరు. అందుచేతనే తలిదండ్రులు బిడ్డలపట్ల నిండుప్రేమతో వుండడం అవసరం.

ఒక్కమాటలో చెప్పాలెనంటే, మొక్కకు నీరు ఎలా జీవనాధారమో, అలానే తలిదండ్రులు చూపే ప్రేమ బిడ్డలు పెరగటానికీ, అభివృద్ధి పొందటానికీ, మంచి నడవడి పట్టువడటానికి ముఖ్యమయిన ఆధారమైవుంది.

---

మీ పెద్దమ్మ

---




చదరం నాలుగు మూలలా వున్న కారులలో ఒక కారు మాత్రమే చదరం మధ్యని ఉన్నయింట్లోకి పోగలదు. ఆకారు ఏదో కనుక్కోండి. మీరు కనుక్కోలేకపోతే జవాబుకి, 11-వ పేజి చూడండి.

పజిలుకు




జవాబు



11-వ పేజీలోని ఓడ బొమ్మలకి జవాబు: 1, 9 నెంబర్లుగల ఓడలు రెండూ ఒక్కమాదిరివి





# విజ్ఞానంలోని గమ్మత్తులు

ఇప్పుడు, మీకు కని విని ఎరుగని తమాషాలు కొన్ని చెబుతాను. ఒక మైలతుత్తం ముక్క తీసుకురండి. దానిని మెత్తగా పొడిచేసి, నీళ్లలో కలిపారంటే అది నీలి రంగు ద్రావకంగా తయారవుతుంది. ద్రావకం చిక్కగా ఉండాలి.

ఈ ద్రావకంలో ఒక ఇనుపమేకు పడవేసి, రెండు మూడు గంటలసేపు ఉంచి, తరవాత ఆ మేకు చూడండి. మీరు ఆశ్చర్యపడేటట్టు, అది తళతళమెరుస్తూ, రాగి పూత వేసినట్టుగా వుంటుంది. మొదట మీరు తయారుచేసిన ద్రావకానికి ఉండిన నీలిరంగు ఇప్పుడు పోయివుంటుందికూడా.

ఇదుగో, మైలతుత్తం వాడేటప్పుడు జాగర్తగా ఉండాలి సుమండీ. అది విషం. కనుక, కంటికీ నోటికీ తగలనీయకూడదు. తమాషా చేయటం పూర్తి అయాక, చేతులు శుభ్రంగా కడిగేసుకోవాలి.

ఇంకో చిత్రం :

మైలతుత్తం ముక్క ఒకదానిని తీసికొని, తెల్లటి మంటలోపెట్టి గమ్మత్తు చూడండి. ఆ మంట మంటంతా నీలిరంగుగా మారిపోయి, కంటికి ఎంతో ఆనందంగా కనపడుతుంది.

ఈ చిత్రాలు మీరుచేయగా చూసే స్నేహితులు మిమ్మల్ని ఎంతో మెచ్చుకొని, 'భేష్! భేష్!!' అంటారు.

వచ్చేసారి మరికొన్ని కొత్త గమ్మత్తులు.



క్రిందటి నెల 'చెట్టుమీద పులి' బొమ్మకి రంగులు వేశారుకదూ. ఇప్పుడు ఈ 'చెరువులో కొంగ' బొమ్మకి ఏయే రంగులు వేస్తే బాగుంటుందో ఆలోచించి అలా రంగులు వెయ్యండి. మీరు రంగులు వేసిన బొమ్మని వచ్చేనెల (జూన్) చందమామ

# హిందీ మొదటి పాఠము

अ आ इ ई उ ऊ ऋ

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ

ए ऐ ओ औ अं अः

ఏ ఐ ఓ ఔ అం అః

क ख ग घ ङ

క ఖ గ ఘ ఙ

च छ ज झ ञ

చ ఛ జ ఝ ఞ

ट ठ ड ढ ण

ట ఠ డ ఢ ణ

त थ द ध न

త థ ద ధ న

प फ ब भ म

ప ఫ బ భ మ

य र ल व श ष स ह क्ष त्र ज्ञ

య ర ల వ శ ష స హ క్ష త్ర జ్ఞ

# రెండవ పాఠము

ముందు పేజీలో యిచ్చిన మొదటి పాఠంలోని అక్షరములు పలకమీద వ్రాసుకుని ఒక్కొక్కటిగా పలుకుతూ దిద్దవలెను.

ఈ క్రింది మాటలను ఉచ్చరించటం నేర్చుకొని అర్థములు గుర్తుంచుకోండి

आज – అజ్ – ఈరోజు
ईख – ఈఖ్ – చెఱకు
उठ – ఉఠ్ – లెమ్ము
ऊन – ఊన్ – ఉన్ని
ऋण – ఋణ్ – ఋణము
एक – ఏక్ – ఒకటి
ऐब – ఐబ్ – దోషము
ओस – ఓస్ – మంచు
और – ఔర్ – మరియు
अंग – అంగ్ – శరీరములో ఒక అంగము

ఈ క్రింది అక్షరములను కనుక్కోండి

क फ व ब प ष य
म भ थ ण ग ज च ञ
ङ झ ध घ ड छ ह ठ
द ढ ट त न ल क्ष
र स ख

ఒకటికి నాలుగుసార్లు చదివి, అక్షరం చూడటంతోటె అది ఏ అక్షరమో తెలుసుకో గలిగేలాగున నేర్చుకోండి.

హిందీ మాటలలో చివరి అక్షరము పూర్తిగా పలుకబడదు. సగము మాత్రమే పలుకవలెను. (ఉదా:—आज అనుమాటను 'అజ్' అని పలుకవలెను. 'అజ' అని పలుకకూడదు.

వచ్చే నెల చందమామలో, హిందీ మాటలు ఎలా పలుకవలసిందీ యింకా విపులంగా చెప్తాను. 'క' గుణింతముకూడా వుంటుంది.

Printed and Published by B. NAGI REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras
Editors : CHAKRAPANI and K. RAJA RAO.



Chandamama, May '49

Photo by B. Ranganadham

నన్ను జైలులో పెట్టారు!

